శ్రీమత్ప్యన్నవ ఆనందరాయ ప్రియశిష్యుండగు

వంకాయలపాటి రామకోటయ్యకృతి

---

# ఆనందరాయశతకము

అను యోగశాస్త్రము.

---

శ్రీకురుచేటి నరసింహంపంతులుగారిచే సరిచూడబడి

ఏతద్గ్రంధకర్తగారి ప్రియశిష్యులైన నైజాం యిలాకా మధిర
తా॥ రేమిడిచర్ల నివాసులు రేమిడిచర్ల హనుమంతరావు
పట్వారీ బొర్రా రామయ్య పటేల్ మాలీ
మిర్యాల వెంకటనరసయ్య కుమారుడు రామయ్య
గార్ల ద్రవ్యసహాయంబున
ప్రకటింపబడియె.

---

కే. వి. క్రిష్ణారావుచే
గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపంబడియె.

1913. వెల రు 0-1-0.

5. పద్మజుని రాణిపదములు♦ బ్రస్తుతించి
విద్య నేర్పిన కురిచేటి♦ వేంకటనర
సింహాయార్యుని నుతియింతు♦ శ్రేష్ఠముగను॥ నత॥

6. రాజయోగరహస్యంబు♦ రమ్యముగను
వేగమే దెల్పి భ్రమలెల్ల♦ పొడ జేసి
నన్ను జూపితివహహ ని♦న్నెన్న వశమె॥ నతజన॥

7. లలితవార్తాకనగర స♦త్కులజుఁడైన
తిరుమలాహ్వాయుపుత్రుండ♦ దేవనన్ను
నిలనుబిలుతురు రామకో♦టీశ్వరుఁడని॥ నతజన॥

8. రామతత్వంబు దెల్పి ని♦ రామయంబు
సాజ్ఞ జేసిన నాగబా♦ సాహ్వాయునకుఁ
బూజలొనరింతు గురుఁడని♦ బుధులు మెచ్చ॥ నత॥

9. ఆంధ్రకవితం బటంచును♦ యాత్మలోన
రోయక నుమీరు దీనిలో♦ రూఢిగనుఁడి
మాయఁదిగనాడి తాగను♦ మాక్షి దేవ॥ నతజన॥

10. వచ్చిరానట్టిపలుకులు♦ వలుకునట్టి
బాలకునిముద్దుమాటలు♦ బాగవినియు
తల్లిదండ్రియు మదిచాల♦ నుల్లసిల్లు
భంగి మత్కృతివిని బ్రోవు♦ భవ్యచరిత॥ నతజన॥

11. రాజమార్గంబు కైనడి♦ రాజయోగ
మిల ప్రసిద్ధంబు నొందఁగ♦ దెలియలేక

యితరయోగంబులందున • వెతకు టేల॥ నతజన॥

12. పుట్టగోచులు మొనైనఁ • బెట్టవచ్చు
భూతి మైనిండ పలుమారు • బూయవచ్చు
రాజయోగంబుసాధింప • రాదుభువిని॥ నతజన॥

13. శ్రీకరంబగు సద్గురు • సేవ జేసి
కామవర్గంబులను ద్రుంచి • ఘనముగాను
సాంఖ్యతారక యోగముల్ • జరుపవలయు॥ నతజన॥

14. పంచముద్రల కొందరు • బట్టి మిగుల
పూర్ణ భావులమనుచును • పొంగుచుందు
రట్టివారికి బయలెట్లు • పట్టువడును॥ నతజన॥

15. నీటిపైఁబుగ్గవంటిది • నిలువఁబోదు
కర్మచేగల్గె నీమేను • ఘనముగాను
గాన దీనినిపోషింపఁ • గలదె ముక్తి॥ నతజన॥

16. అష్టభోగంబులను జను • లాశ్రయింతు
రట్టివెల్లను క్షీణంబు • లనెడిమాటఁ
దెలిసియటు నటింపరే • దేవదేవ॥ నతజన॥

17. ఈషణాత్రయములఁ జిక్కి • యుంపుగాను
భక్తి భావం బెఱుంగక • బాపులగుచు
జచ్చిబుట్టుచునుందురు • జనులుమిగుల॥ నతజన॥

18. సకలకర్మలవిడచి యీషణాలనడఁచి
శివునిభజియింపుచుండిన • శివకరునకు

మోక్షమర చేతిలోనుంచు• మోహరహిత॥ నతజన॥

19. దినముకొకయామమైన భూ• తేశుఁదలఁచు
చున్న రెండవవిధమని• నెన్నఁబడును
తారకంబున కిదిమేలు• దరచిచూడ॥ నతజన॥

20. గురునిపాదాంబుజములు హృ• త్సరసిజమున
నిల్పి శుశ్రూష జేయుచు• నిశ్చయముగ
ధరణిచరియించువాడెపో• ధన్యుఁడనఘ॥ నతజన॥

21. భుక్తికిని లేక ఛాత్రుల• పొందుపరచి
యుక్తివేదాంతవాక్యముల్• శక్తికొలది
బలుకువారికిఁ బ్రహ్మంబు• బట్టువడునె॥ నతజన॥

22. ధనముగల్గినశిష్యులఁ• దాపుఁజేర్చి
ధనములేనట్టివారలఁ• దరిమివైతు
రట్టిగురువులు గురువులా• యల్పు లరయ॥ నతజన॥

23. గాడిదలకొకవట్టి సా• గరమునీద
రొమ్ముబగులఁగదన్న దా• రూఢిగాను
చెడుమతులబోధగోరిన• జెడుదురట్లు॥ నత॥

24. ఉద్భవాబ్ధికి వెఱచి యా• యుర్విలోన
శరణుశరణన్న వారలఁ• కరుణజూడ
కున్న యాగురుమూర్తిని• నెన్నఁదగదు॥ నత॥

25. తత్వమునుగన్న గురువులు• ధాత్రిలోన
శిష్యులనుగూర్చి సద్బోధ• జేయుచుండ

గనియుఁ గొందరు జేతురు•కల్ల బోధ॥ నత॥

పంచపాది.- అల్పుఁడై యనుభవము లేని•యాత్మబోధ
పరులకుం జేయు పాపపు•గురుని నడత
కోడలకు బుద్ధిగరపి రం•కునకు బోవు
నత్తసామ్యముగాదె ద•యాసముద్ర॥ నతజన శ్రేయ॥

27. తత్త్వపరిచారమును జేయఁ•తలఁపుఁగలుఁగ
నదియు బోజేయుచుండెడి•దణవమలమ
టంచు యోగులు బలికిరి•యార్యవినుత॥ నతజన॥

28. కార్మికంబన సుజ్ఞాన•కాండవిషయ
ములను గురువులుఁ బోధాపఁ•గలనఁ జెంది
బుద్ధికెక్కంగనివ్వదు•పూర్వభవము॥ నతజన॥

29. శ్రీకరంబగు గురునాజ్ఞ•లేక దాను
శిష్యులకు బోధ జేయును•శ్రుతులు జదివి
దొంగగురువులు వీరెపో•దోషరహిత॥ నతజన॥

30. ఎల్లకాలంబులను యోగు•లెరుఁగఁబడిన
తత్త్వమును మది నెప్పుడుం•దగులనీక
నకళితను జెందుచుండుమా•యికమలంబు॥ నతజన॥

31. అరయ మాయేయమలము మ•హాఘసమితి
కార్యములయందు జొన్పును•గాన దాని
నెంచరాదనికవులు వ•చించిరిలను॥ నతజన॥

32. నిర్గుణ బ్రహ్మమునకంటె • నెరుక లోని
దేవతలు యంత్రతంత్రముల్ • భావుకంబు
లనతిరోధాన మలమగు • నాత్మరూప॥ నతజన॥

33. దేహమునకునుగల్గెడి • తీరులెల్ల
దేహికనుచును దలచుట • ధీవిచార
నరయనధ్యాత్మికంబని • రాత్మవిదులు॥ నత॥

34. వినుము నతిభౌతికంబన • విశదమయ్యె
ఘనముగా మృగసమితిచే • గల్గుబాధ
లాలుబిడ్డలదుఃఖంబు • లకు నడలుట॥ నతజన॥

35. అరయ నతిదైవికంబన • యాలకింపు
డవనిలో జనులకుఁగల్గు • యాపదలను
జూచితా చింత జేయుటే • నొప్పడంగి॥ నత॥

36. జ్ఞానభూమికలనుగల్గి • మానుగాను
సంచరించినమనుజుండు • సద్గుణుండు
నవియ లేకున్న మూఢుడే • యనగ బరగు॥ నత॥

37. మంత్రములలోన శ్రేష్ఠమౌ • మంత్రమరయ
తారకంబని శ్రుతులెల్ల • దరచిబలుకు
చుండ నెరుగ రదేమి భూ • మండలమున॥ నత॥

38. అరయ వాకింద్రులో మ్మిది • నమరియున్న
యింతి పైబ్రభమనిడి పాప • మెప్పుడు సేయు
వారి లెమబాధఁ బొలఁగిపో • వశమొ దెలియ॥ నత॥

39. దుర్గుణంబులుగలవారింతోను చెలిమి
శేయ సద్గుణుఁడైననుం జెడును సర్వ
దానదీజల మబ్ధిలోఁ డాగినట్లు॥ సతజన॥
40. రమ్యమగు లోకసృష్టి యేం రాజసంబు
సత్వగుణమునవృద్ధియుం సమయుటెల్ల
తామసంబందు రుర్విలోం తత్వవిదులు॥ నత॥
41. యెప్పుడైనను సద్గురుం నింపుమీర
దలువకుండిన మూర్ఖుసంధర్మరాజు
భటులు నిరయములోనై చిం బాధ జేయు॥ నత॥
42. మద్యపానంబొనర్చినం మనుజుఁడీలను
పూని శలభాదియోనులం బుట్టుచుండు
రందువలనను మద్యపానంబువలదు॥ నత॥
43. హాటకంబును భూసురులపహరింప
సర్పజలచరములుం గొండంసాలెపురుగు
లాదిజన్మంబులెత్తుదుం రార్యవినుత॥ నత॥
44. శాస్త్రపుంజంబు లెన్నైన జదువవచ్చు
కాశిరామేశ్వరంబులం గాంచవచ్చు
బట్టబయలైనదానినిం బట్టలేరు॥ సతజన॥
45. శ్రీమదాద్యంతరహిత సంచ్చిత్ప్రకాశ
యోగిజనగేయ నిర్గుణం నాగరహిత
రూపనామాదివిగతం చిద్రూపదేవ॥ నత॥

60. శ్రీమదాత్మస్వరూపస॥క్షీరవార్ధి
శయన సద్గురువర్య నీ॥చరణయుగళ
మునుభజించెదఁ సుశ్లోకముల వచించి॥నత॥

61. కర్తయైయుండి దెలియఁ దా॥కర్తగాడు
భోక్తయైయుండి వీక్షింపఁ॥భోక్తగాడు
యుక్తిచే గననాయె నిం॥రుత్తరుండు॥ నత॥

62. జలధిలోతింతయని తాను॥జెప్పవచ్చు
తప్తకాంచనమెంతైనఁ॥ద్రావవచ్చు
దేశికుఁడు లేక తనుఁదా నె॥తెలియలేఁడు॥నత॥

63. చూపువాడును మరితన్నుఁ॥జూచువాడు
చూడుమనువాడు దెలిపిన॥చూడనట్టి
వాఁడు వాడనువానిఁ గ॥న్వాడెయోగి॥నత॥

64. మూడుగలసినదానిచే॥మూడుగల్గ
మూడుగడచినవారికిఁ॥మూడునున్న
నాడు నేడనకనుజెలగె॥నాశరహిత॥నత॥

65. తానుతానైనవారికి॥ధరణిదృశ్య
జాలమెల్లను నశ్యమై॥జాడలేక
బోవుచుండగ రెండేల॥బోకయుండు॥నత॥

66. మండలత్రయమునుగడచి॥దండిగాను
కుండలీంద్రుని మేల్కొల్పి॥కువలయమున
నిండియుండినవాడవు॥నీవెకావె॥ నత॥

67. మనమె దేహత్రయనిరూఢి॥ మార్గమరయ
మనమె రాగాది వృత్తుల॥ మతము దెలియ
మనమె హితదారపుత్రుల మరగిజూడ॥నత॥

68. నిద్రతావ్యాయి జగమును॥ నెఱుగకుండి
నిద్రమేల్కొన జగముతా॥ నెరుగునటుల
మోక్షమార్గము గనుటకు॥ మొదలు మనము॥నత

69. ఇలఁజనులుచూడ కర్మలో॥ మెలగుచుండి
వాదభేదంబు లుడిగి సం॥సాధువృత్తి
గలిగినటియించువాడెపో॥ఘనుడు పృథ్వి॥నత॥

70. పుస్తకంబులు మంత్రముల్॥ పూజవిధులు
కథలు వరయంత్రతంత్రముల్॥ఘనముగాను
కడగిబ్రహ్మానుభవవిఘ్న॥కరములరయ॥ నత॥

71. కందమూలఫలంబులు॥ఘనముగాను
విందులనుచేసి గుహలలో॥ వెలికిరాక
ముక్కుబిగియించి కూర్చున్న॥ముక్తిగలదె॥నత॥

72. కర్మలోఁజిక్కి మూర్ఖులు॥ఘనులమనుచు
శిలలపూజింపుచుందురు॥శిగ్గులేక
తానుగాకున్న శిలలెట్టి॥దైవములగునొ॥ నత॥

73. ఉన్నదనిబల్కు వారికి॥నుండుజగము
లేదులేదన్న వారికి॥ లేకపోవు
వాదభేదంబులేలను॥వరగుణాఢ్య॥ నత॥

74. తత్వమస్యాదిలక్ష్యంబు•దానటంచు
నను భవముచేతగనెడువాం•డవనియందు
ముక్తుఁడని చెప్పఁబడు శాస్త్ర•ములనుజాల॥ నత॥

75. బయలు నాకసమనుచును•భయముబెట్టు
చుంసురది నమ్మకుండుమిాం•డెందమునను
యనుచు తెల్పితి రదెచాలు•నార్యతిలక॥ నత॥

76. వెదకివెదకియు గనలేని•విమలబయలు
బ్రహ్మమని యోగివరులెల్ల•బలుకుచుందు
రట్టి బయలిదియని గను•నతఁడె బ్రహ్మ॥ నత॥

77. నాదుబిందుకళాతీత•మాదిమధ్య
మాంతరహితంబుఁ బ్రహ్మంబ•నంగవచ్చు
గాని బ్రహ్మంబు గగనంబు•కాదుజగతి॥ నత॥

78. బయలులోపల బయలుని•ర్బయలు బ్రహ్మ
గానిబయలెల్ల బ్రహ్మంబు•గాదటంచు
దెలియవలయు ముముక్షువుల్•ధీరవర్య॥ నత॥

79. భక్తిశోభితశాంభవీ•యుక్తిఁదెలసి
ముక్తికాంతనుకలిసి తాం•మురియుచున్న
నతఁడెసద్గురుఁడనఁదగు•నవనియందు॥ నత॥

80. అద్దమందునరూప మాం•జ్యంబుఁజిహ్వ
యాకసమునకు మారుతం•మంటనట్లు
పాపములనంటకుండును•బ్రహ్మవేత్త॥ నత॥

81. జ్ఞానమన్న నువినుము య♦జ్ఞానమనిన
స్వస్వరూపంబటన్న ను♦సగుణమనిన
మాయకేగల్గు నీనామ♦ధేయసమితి॥ నత॥
82. సాగరములోన బహుజల♦చరములుండి
నవియు సాగరమెరుగని♦యట్లుయెరుక
నెరుఁగదెప్పుడు బ్రహ్మ బ♦దేమొగాని॥ నత॥
83. బ్రహ్మవేత్తలలోని సం♦ద్భావమరసి
జూడనంతటివారికే♦జాడదెలియు
గాని కుపితులెరుంగరు♦కమలనాభ॥ నత॥
84. మాయలోపలజన్మించి♦మాయలోన
బెరిగి మాయనుగనలేని♦పెద్దలెల్ల
వ్యర్థులని పిల్వబడునయ్య♦వరగుణాఢ్య॥ నత॥
85. ఎట్టిసాధన లేకుండ♦బట్టబయలు
జూపి శిష్యులపాపముల్♦రూపుమాపు
చున్నవానిని గురుఁడని♦యెన్నవచ్చు॥ నత॥
86. జ్ఞానమనువహ్ని చేతను♦మానుగాను
కర్మలనుగాల్చి వేయును♦నిర్మలుండు
నట్టివానికి నితరేచ్ఛ♦బుట్టబోదు॥ నత॥
87. అర్చనాదులచేత లో♦కాంతరముల
ప్రాప్తియేకాని ముక్తిని♦బడయబోర
టంచుబల్కెడివారల♦నెంచరాదు॥ నత॥

88. తన్ను గనుగొన్న వారలు•ధరణిలోన
శిలలపూజింపుచుండుట•చిత్రమరయ
కక్కినన్నంబుగొని తాను•మెక్కినట్లు॥ నత॥
89. పంచమలములదృంచియు•బాగుగాను
సంచితాగాములను దృంచి•సాంఖ్యయోగ
మాశ్రయించియు నినుగను•మాన్యుడెపుడు॥ నత॥
90. కడగి తాపత్రయంబులు•ఖండనంబు
జేసి యింద్రియములకును•జిక్కువడక
సాక్షియేనేనటన్న ను•మోక్షమబ్బు॥ నత॥
91. శూద్రుడవు లెమ్ము లెమ్మని•సొగదిబల్కు
చు ౦డు రవివేకు లెల్లను•జోద్యమరయ
మిగుల శూద్రత్వ మజ్ఞాన•మగును దేవ॥ నత॥
92. కులముగోత్రంబు నామముల్•గుణములరయ
నస్థిరంబగు మేనికి•నమరియుండె
గాని దేహికి లేవని•గానవలయు॥ నత॥
93. ధరణిప్రజ్ఞానమనిన చై•తన్యమనిన
కాలమనిన సకాల యు•కాలమనిన
బ్రహ్మమనినను యాత్మన•ప్రకృతినూవె॥ నత॥
94. సుతులనంగను వేరుగా•జూచు ఖేల
నద్దమున•గనురూపు తా•నాటకరణి
భార్యయే తల్లి తల్లికి•భర్త తాను॥ నత॥

95. భార్యయని మొడియుద్దము • బారజూడ
బుత్రుఁడనుబింబ ముంగున • బొందియుండు
నట్టివిధమున భార్యకు • బుట్టుతాను॥ నత॥

96. అరయ సింహంబు గజముతో • నని యొనర్ప
భుజవిహీనుండు వాటిని • బోడిచిచంప
చక్షుహీనుండు గని మది • సంతసించె॥ నత॥

97. తత్వవేత్తలు మదిని సం • తసము జెందు
నట్లు రచియించి శతకమి • ప్పట్లమీకు
నర్పణము జేసి మ్రొక్కితి • నాత్మరూప. నత.

98. ఇట్టి శతకంబులో పలి • గుట్టుదెలిసి
బట్టబయలునదిరి గెడి • బ్రహ్మవేత్త
లకును మ్రొక్కెద జగతిలో • బ్రకటితముగ. నత.

99. అరయ నిద్రావాయఁ జదివిన • ననుదినంబు
వినిన నిహలోక సౌఖ్యముల్ • వేడుకలర
గాంచియును ముక్తికాంతతో • గలయుననఘ॥ నత॥

100. లాలి సద్గురుమూర్తి కిఁ • లచ్చిపతికిఁ
లాలి శివునకుఁ భ్రూమధ్య • బాలకునకు
లాలియని బాగడుచుం జెద • మేలుగాను॥ నత॥

101. లాలితంబగు గురునకు • లక్ష్మణాగ్ర
జునకు శివునకు బ్రహ్మకు • ఘనముగాను
జోలబాడెద నిత్యంబు • సూరివర్య. నత.

102. లింగతనువును వేమారు•భంగపరచి
సంగరహితుండవైన శ్రీ•సద్గురుడవు
మంగళంబిదె గైకొను•మాన్యచరిత
నతజనశ్రేయ యున్నవా•నందరాయ.

క. శ్రీవున్నవవంశోద్భవ
కేవలచైతన్యరూప•క్లేశవినాశా
భావుకముగ నను బ్రోవుము
దేవర యానందరాయ•దేశికరాయ.

ఆ. వె. వసుధలో వికారి•వత్సరంబున చైత్ర
శుద్ధనవమివరమున•భద్రశైల
వాసుఁడైన రాఘ•వానుగ్రహంబున
వ్రాసివాడ దీని•వసుధయందు.

గద్య.

ఇది శ్రీరామచంద్రపరబ్రహ్మ వరప్రసాదలబ్ధ కవితా
విలాస సకలజనమిత్ర వంకాయలపాటి తిరుమల
రాయ వేంకమాంబాపుత్ర నైజాంయిలాకా మ
ధిర తాలూకా రేమిడిచర్ల రూలర్ స్కూల్
మాష్టరయిన వంకాయలపాటి రామ
కోటదాసు విరచిత ఆనందరాయ
శతకము సంపూర్ణము.

---